

# విమర్శనము



## అమరజీవులు

నాల్గుభాగములు. మంత్రివాది సంపాదితములు. తెనాలి సుందరరామ్ అండు సన్సు ప్రచురణలు.

పసిపిల్లలను సన్మార్గవర్తనులను జేయుటకును, వారికి మహోత్తమ ఆదర్శములను బోధింపజేసి నీతిమంతులను జేయుటకును అమరజీవులైన మహాపురుషుల జీవితచరిత్రలు మిక్కిలి తోడుపడగలవు. అట్టి ఉద్దేశ్యముతోనే వ్రాయబడిన ఈ చిన్నపుస్తకములు ప్రాథమిక తరగతులలోని విద్యార్థులకు తరగతి క్రమమున బాగుగా ఉపకరించునవిగా యున్నవి. అనేక వర్గములకు, అనేక శాఖలకు చెందిన పలువురి జీవితగాథలు వీనిలో నున్నవి. కొందరు స్త్రీ రత్నముల చరిత్రములుకూడ గలవు. కాని ఈ చరిత్రల వర్గీకరణములో కొందరి చరిత్రల పునరుక్తి, కొందరి చరిత్రల లోపము లేక వీలయినంత సమగ్రముగా కూర్చియుండినయెడల ఇంకను బాగుండెడిది.

---

## తెనుగుతల్లి

రచయిత: మాగంటి బాపినీడుగారు. ప్రకాశకులు: జాతీయ జ్ఞానమందిరం, త్యాగరాయనగర్, మద్రాసు ౧౭. వెల రూ. ౨.

తెలుగుదేశాన్ని గురించి సాకల్యంగా చిన్నపిల్లలకు వారి చిన్నారిభాషలో చిత్రమయంగా తెలియ చెప్పడానికై చేసిన ప్రయత్నం ఇది. పిల్లల పుస్తకాలు, ఇతరప్రాంతాల్లోవలె, ఆట్టేలేని మనకు ఇటువంటివి చాలాచాలా అవసరమనడం ఎవరూ కాదనరు. కాగా, బాపినీడుగారి ఈ యత్నం తప్పక సర్వథా కొనియాడదగింది. దీని నిర్మాణంలో వారి ఉత్సాహం బాగా ద్యోతకమవుతున్నది కూడా. కూర్పు తీర్పులుకూడా మహా ముచ్చటగా ఉన్నాయి. కాని, ఆంధ్రబాలసర్వస్వం అని దీన్ని పేర్కొనడం మాత్రం అంత సమంజసం కాదేమో అనిపిస్తున్నది. ఎన్నో విషయాలు ఇందులో లోపించి, దీనికి అసమగ్రత కల్పిస్తుండడం నిజంగా విచారకరవిషయం. ఉత్తర ముద్రణంలోనైనా దీనికి ఆ సమగ్రత కల్పిస్తారని ఆశిస్తున్నాము.

---

# గ్రంథ స్వీకారము

---

### జంతుశాస్త్రము

గ్రంథకర్త: ఆర్. వి. శేషయ్య, యం. ఏ. గారు. ప్రకాశకులు: ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు. వెల రూ. ౫-౮-౦.

### శిల్పదర్శనము

గ్రంథకర్త: కొండూరు వీరరాఘవాచార్యులుగారు. ప్రకాశకులు: విశ్వజ్ఞ మండలి, తెనాలి. వెల రూ. ౨-౮-౦.

### ఆత్మోపహారము

కవి: బులుసు వేంకటేశ్వర్లుగారు, బి. ఏ., రామారావుపేట, కాకినాడ. వెల అ. ౮.

### రంగవల్లి

పాటీకథలు. ప్రకాశకులు: సాధన సమితి, ౬౭౮౨ ఇమాంబావివీథి, సికిందరాబాదు. వెల పావలా.

### ఆంధ్ర రాజభక్తులు

గ్రంథకర్త: ఆండ్ర శేషగిరిరావుగారు, బి. ఏ., వెల అ. ౧౨.

### ప్రవాసి

చిన్ననవల. కర్త: శ్రీపతి నరసింహారావుగారు, బి. ఏ., వెల అ. ౧౨.

### ప్రేమాంజలి

టాల్‌స్టాయికథకు అనుకరణ. కర్త: ముద్దా విశ్వనాథంగారు. వెల అ. ౧౨.

పైమూటికి ప్రకాశకులు: జయనికేతనం, మద్రాసు ౭.

### ప్రసూనాంజలి

కవి: మూపాటి వెంకటకృష్ణ రాఘవాచార్యులు గారు. ప్రకాశకులు: వెంకటేశ్వర అండుకో, గుంటూరు. వెల. అ. ౮.

### ఆంధ్ర దేశ గ్రామచరిత్ర (మోదుకూరు)

గ్రంథకర్త: కొడాలి లక్ష్మీనారాయణగారు. ప్రకాశకులు: మాడెర్న్ పబ్లిషర్సు, తెనాలి. అమూల్యము.

### కథలు - గాథలు

మూడవభాగము. రచయిత: దిగవల్లి వెంకటరావుగారు, వకీలు, బెజవాడ. వెల రూ. ౨.

### మాకేలోకం

రచయిత: శ్రీమంతరావు వెంకటరావుగారు. రూ. ౧.

### సినిమా జ్వరం

రచయిత: చలంగారు. వెల రూ. ౧

పైరెంటికి ప్రకాశకులు: ప్రతిమాబుక్సు, ఏలూ

### తత్త్వామృతము

కవి: వాజపేయయాజుల రామసుబ్బారాయ గారు, బి. ఏ., కొల్లాపురం, జటప్రోలు సంస్థానం. వెల రూ. ౧.



Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No, 7, Thambu Chetty St., G. T., Madras. Editor—S. Sambhu Prasad.



## ఫిబ్రవరి, 1947



---

### ఫిబ్రవరి కథలపోటీ-బహుమానాలు.

ఫిబ్రవరి కథానికల పోటీకి వచ్చిన కథానికల్లో కూడా ప్రథమ ద్వితీయ బహుమతులకు యోగ్యాలైన కథలు పొత్తిగా రానందువల్ల మూడవశ్రేణివే మూడు కథానికలుగా చూచి ఈ సంచికలో ప్రచురించడమైనది. ఆ మూటికిని, (వ్యక్తావ్యక్తంలో యుద్ధం; కుటుంబం; మాతృదేవి) విడివిడిగా మూడు తృతీయ బహుమానాలు

